

# దస్త్రం:దత్తాత్రేయ

ఈ పేరుతో ఫైలేదీ లేదు.

**దత్తాత్రేయ** 1956 జూన్ 1వ తేదీన జన్మించారు. టెంపుల్ ఆల్వాల్ , సికిందరాబాద్ ,**తెలంగాణ రాష్ట్రం.వృత్తి వేణుగాన విద్వాంసులు**.

**దత్తాత్రేయ** రంగారెడ్డిజిల్లా, టెంపుల్ ఆల్వాల్, సికిందరాబాద్ లో బాబురావు జోషి, రుక్మిణి దంపతులకు జన్మించారు. వీరి నాన్నగారు ప్రఖ్యాత హిందుస్తానీ గాయకులు. వీరి కుటుంబీకులు వృత్తి రీత్యా గ్రామ పౌరోహిత్యులు. దత్తాత్రేయ చిన్నప్పటినుండి నాన్నగారి వద్ద హిందుస్తానీ గాత్రము సాధన చేశారు. 18 సంవత్సరాల వరకు గాత్రము సాధన చేసి 1964 వ సంవత్సరంలో ప్రముఖ పండిత్.హరిప్రసాద్ చౌరసియా గారికచేరి నాన్నగారితో కలిసి వెళ్లి వారి వేణు వాద్యంతో స్పూర్తిని పొంది ఎలాగైనా వేణువు నేర్చుకుందామని నిశ్చయించుకున్నారు. కానీ అప్పట్లో వేణువు నేర్పించే గురువులు లేకపోవడం వల్ల నాన్నగారి పర్యవేక్షణలోనే సంగీత పాఠాలు వేణువుపై స్వయంగా సాధనచేసి రేడియో ఆడిషన్లో ఉత్తీర్ణత పొంది యువవాణి కార్యక్రమం ద్వారా సంగీత ప్రయాణం మొదలుపెట్టారు. ఆ తరువాత ప్రముఖ కర్ణాటక వేణు విద్వాంసులు శ్రీ ఎన్.ఎస్ శ్రీనివాసన్ గారు ఎంతో వాత్సల్యంగా కర్ణాటక సంగీత పాఠాలు చెప్పడం మొదలుపెట్టారు.

| దత్తాత్రేయ | |
|---|---|
|  దత్తాత్రేయ | |

| దత్తాత్రేయ | |
|---|---|
| **జననం** | దత్తాత్రేయ<br>1956 జూన్ 1<br>టెంపుల్ ఆల్వాల్ , ,సికిందరాబాద్<br>తెలంగాణ రాష్ట్రం |
| **వృత్తి** | వేణుగాన విద్వాంసులు |
| **ప్రసిద్ధి** | వేణుగాన విద్వాంసులు |
| **మతం** | హిందూ |
| **భార్య / భర్త** | శ్యామల |
| **పిల్లలు** | 1.మానస మాధురి<br>2. సుమన ప్రీతి<br>3. సమీర సంధ్య |
| **తండ్రి** | జోగవజ్ఝల బాబురావు జోషి |
| **తల్లి** | రుక్మిణి |

## జీవిత విశేషాలు

1980వ సంవత్సరం నుండి ప్రదర్శనలు మొదలుపెట్టారు. మొట్టమొదటిగా హైదరాబాద్ దూరదర్శన్ లో యోగివేమన అనే తెలుగు టెలీ ఫిలింతో మొదలై అనేక కార్యక్రమాల్లో పాల్గొన్నారు. వీరి నాన్నగారు కిరానా ఘరానా సంప్రదాయానికి చెందిన హిందుస్తానీ సంగీత విద్వాంసులగుట చేత శాస్త్రీయ సంగీతం మాత్రమే వాయించమని సినిమా పాటలు వద్దు అని చెప్పేవారు. నాన్నగారు 1979 వ సంవత్సరంలో మరణించారు. ఆ తరువాత కుటుంబ భారం తనపై పడటంవలన కుటుంబ అవసరాలకొరకు అన్నిరకాలైన ప్రదర్శనలకు వేణువు వాయించడం మొదలుపెట్టారు. అప్పుడు హైదరాబాదులో బాన్సురి వాయించే వారు ఎవరూ లేకపోవుట వలన విరివిగా అవకాశాలు వచ్చాయి. సినిమా రికార్డింగ్స్, స్టేజ్ ప్రోగ్రాములు ఎక్కువగా మొదలయ్యి అనేక కార్యక్రమాలలో పాల్గొన్నారు.

1981 వ సంవత్సరంలో ఒక జూనియర్ కళాశాలలో నాన్ టీచింగ్ స్టాఫ్ గా సెలెక్ట్ అయ్యి ఉద్యోగంలో చేరారు. అదే సమయంలో రికార్డింగ్స్ కూడా చాలా ఎక్కువ అయి సెలవులు దొరకకపోవడం వల్ల ఎంతో ఇబ్బందిపడ్డారు. దీనికి తోడుగా వీరి గురువుగారు ఎన్ ఎస్ శ్రీనివాసన్ గారు ప్రముఖ నృత్య కళాకారులకు కర్ణాటక సంగీతం కూడా వాయిస్తానని చెప్పి వారందరికీ నన్ను పరిచయం చేశారు. ఆ నృత్య కళాకారులు విదేశీ పర్యటనలు నెలల తరబడి చేసేవారు. ఒకసారి 1986లో మూడు నెలలు పాటు సౌత్ ఈస్ట్ కంట్రీస్ వెళ్లవలసి వచ్చి, ఉద్యోగంలో కొనసాగించడం ఇకపై కష్టమని ఆరు సంవత్సరాలుగా చేసిన ఉద్యోగానికి రాజీనామా చేశారు. ఆ తరువాత, సమయం మొత్తం సంగీతానికే కేటాయించుకుని సాధన చేశారు. ఈ ప్రయాణంలో ఎంతోమంది గొప్ప గొప్ప కళాకారులను కలుసుకోవటం మరియు వారితో కలిసి కార్యక్రమాలు చేయడంజరిగింది.

## సంగీత ప్రస్థానం

వీరు కలిసిన కొంతమంది ప్రముఖుల్లో గాయకులు పద్మశ్రీ మంగళంపల్లి బాలమురళీకృష్ణగారు, పద్మశ్రీగులాం అలీ ఖాన్ గారు, నృత్య కళాకారులు హైదరాబాదుకు చెందిన పద్మశ్రీశోభా నాయుడుగారు ఉమా రామారావుగారు ఢిల్లీకి చెందిన పద్మశ్రీ రాజారెడ్డి రాధారెడ్డిగారు, పద్మశ్రీ జయ రామారావుగారు, వనశ్రీ జయరామారావుగారుమద్రాస్ కి చెందిన అలర్ మెయిల్ వల్లిగారు ఇలా ఇంకా ఎంతోమంది కళాకారులు. వీరి గురువుగారైన శ్రీనివాసన్ గారు ఎన్నో ప్రతిష్టాత్మకమైన ప్రోగ్రామ్ రికార్డింగ్స్ చేసేవారు వాటికి గురువుగారికి స్వరాలు రాయడంలో ఉపకరిస్తుండేవారు. వాటిలో వాటిల్లో ఢిల్లీ నుంచి ప్రసారమయ్యే యుజిసి కార్యక్రమాలు ఎన్నో ఉండేవి.

## ఇతర అంశాలు

వీరు ఆల్ ఇండియా రేడియోలో హిందూస్థానీ శాస్త్రీయ సంగీతంలో మరియు లలిత సంగీతం రెండిట్లోనూ గ్రేడెడ్ ఆర్టిస్ట్ గా ఉన్నారు. 45 సంవత్సరాలుగా ఆల్ ఇండియా రేడియో, దూరదర్శన్, ప్రాంతీయ చిత్రాలు, డాక్యుమెంటరీలు స్టేజ్ కార్యక్రమాల్లో పాలుపంచుకున్నారు. వీరు 10 వేలకు పైగా ఆడియో ఆల్బమ్సులో వేణువు సహకారం అందించి సంగీతం సమకూర్చారు. చాలామంది ఔత్సాహికులకు వేణువాద్యంలో శిక్షణఇస్తూ వారి అభివృద్ధికి తోడ్పడుతున్నారు.

## విదేశీ పర్యటనలు

ఎంతోమంది ప్రఖ్యాతి పొందిన కళాకారులకు వేణు వాద్య సహకారం అందిస్తూ దేశ విదేశాల్లో ప్రదర్శనలు ఇచ్చారు. ఇండియన్ కౌన్సిల్ ఫర్ కల్చర్ రిలేషన్స్, ఢిల్లీ వారి సౌజన్యంతో వేణువాదకుడిగా అనేకమంది కళాకారులతో ఇతర దేశాల్లో ఎన్నో ప్రతిష్టాత్మకమైన అంతర్జాతీయ సంగీత నృత్య ఉత్సవాల్లో పాల్గొన్నారు.

1983 వ సంవత్సరంలో మొదటిసారిగా మారిష్యస్ దేశానికి.

1984 సంవత్సరంలో సౌదీస్టు కంట్రీస్ హాంగ్ కాంగ్, మక్కావ్, బ్యాంకాక్, వియత్నాం, కాంబోడియా, లావోస్, సింగపూర్, ఇండోనేషియా.

1985 వ సంవత్సరంలో అమెరికాలో ఫెస్టివల్ ఆఫ్ ఇండియాఉత్సవం న్యూయార్క్ లో మరియు వాషింగ్టన్ లో.

1986వ సంవత్సరంలో సౌత్ అమెరికా ప్రతిష్టాత్మకమైన సర్వెంటినో ఫెస్టివల్

1993 వ సంవత్సరంలో యూఎస్ఏ హార్వర్డ్ యూనివర్సిటీ ఆధ్వర్యంలో మూడు నెలలు.

1996 వ సంవత్సరంలో జర్మనీ, స్వీడన్, నార్వే, ఫిన్లాండ్.

1996 యూఎస్ఏ

1998 యూఎస్ఏ

2008 వ సంవత్సరంలో జర్మనీ, ఇటలీ, వెనీస్

2006 వ సంవత్సరంలో అమెరికా

2007 సంవత్సరంలో సౌత్ ఆఫ్రికా జోహాన్నస్ బర్గ్, కేప్ టౌన్ మరియు దర్బన్

2010 సంవత్సరంలో కెనడా

2017 వ సంవత్సరంలో రష్యా మరియు జార్జియా మొదలైన 25 దేశాలు

## సత్కారాలు

1996లో గౌరవ హానరరీ సిటిజన్షిప్ ఆఫ్ అమెరికా

2014లో కంచి ఆస్థాన విధ్వంసుడిగా సన్మాన పొందారు

2006వ సంవత్సరంలో ఘంటసాల గోల్డ్ మెడల్

**NEWS CLIPS VIDEO LINK**: https://archive.org/details/my-video-8_20250715

## మూలాలు


1. **youtube playlist link**: https://youtube.com/playlist?list=PL_d1kzIcP-moU2uBXvRlCJSr2Cu-Kk0b-&si=UaqFZD7J4iSMFS16

2. **Archives videos link:** https://archive.org/details/@sudarshan_reddy330/lists/32/%23dattatraya_jogavajjula-


## లింకులు

ఈ ఫైలును వాడుతున్న పేజీలు లేవు.